Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ మే నెల 23 వ తేది శుక్రవారం [నె 10 రు.

## ఈ వారంలో యుద్ధ వార్తలు

### విమానదాడులు.

ఈ వారంలో బ్రిటనుపై శత్రు విమానదాడులు చాల తగ్గినవి. బ్రిటిషు విమానాలు మాత్రం యథాపూర్వంగానే జర్మనీపైకి, శత్రు ఆక్రమిత ప్రాంతాలమీదకూ వెళ్లి తీవ్రమైన దాడులు సాగించుచునే వున్నాయి. 14 వ తేది రాత్రి పరాసు తీరపు విమానాశ్రయాలలో చాల శత్రు విమానాలు ధ్వంసంచేయబడ్డాయి. బ్రిటిషు విమానం ఒక్కటి మాత్రం తిరిగిరాలేదు. గురువారం రోజున ఫ్రిజియన్ దీవుల వద్ద యుద్ధ నౌకల రక్షణతో ప్రయాణం చేస్తున్న ఒక శత్రు సరకుల నౌకలగుంపును బ్రిటిషు విమానా లెదిర్చి బాంబులు వేశాయి. వానిలో మూడు నౌకలు పూర్తిగా తగులబడి పోయాయి. నాటి రాత్రి జర్మనీలో పెద్ద పారిశ్రామికపట్నమగు హనోవరుమీద తీవ్రమైన దాడి జరిగింది. బర్లినుగూడ ఈ దాడికి గురియైనది. కొంత విశేషనష్టమే కలిగిందని జర్మనులుగూడ అంగీకరించారు. శుక్రవారం రాత్రి జర్మనీలో మరియొక పెద్ద పారిశ్రామిక పట్నమగు కొలోనుమీద వేలకొలది బాంబులు వర్షించి చాల ఫాక్టరీలను గిడ్డంగులను ధ్వంసంచేసి వచ్చాయి. శనివారం రాత్రి మరల కొలోనుపై పెద్ద దాడి జరిపాయి. చాల ప్రాంతాలలో బాంబులచే పెద్ద పెద్ద మంటలులేచాయి. కాని అంతకంటె తీవ్ర తరమైన దాడి పరాసుకోస్తా రేవులపై జరిగింది. అక్కడవేయబడిన బాంబుల ప్రేలుడులవలన క్రిందనున్న మందుగుండు సామగ్రి ప్రేలుడులవలన కలిగిన శబ్దాలకు బ్రిటిషు తీరములోని ఇండ్లు కదలిపోయినవి. ఆదివారం రాత్రి బ్రిటిషు విమానాలు వందలకొలదిగా బయిలుదేరి, జర్మనీ ఉత్తరభాగంలోవున్న కీలు రేవునందలి నౌకా నిర్మాణశాలలపై భయంకరమగు దాడి జరిపాయి. ఎండెన్ రేవుపైనగూడ చాల వందల బాంబులు వర్షించబడ్డాయి. వీనికి యెక్కువ నష్టమే గలిగినటుల జర్మనులుగూడ అంగీకరించిరి.

14 వ తేది రాత్రి శత్రువులు బ్రిటనుపై యెక్కడాకూడా దాడులు సాగింపలేదు. మరునాడు గురువారంనాడు కొలదిగావచ్చి, తూర్పుతీరపు పట్నాలలో అచ్చటచ్చట కొలదిగా బాంబులువేశాయి. కాని నష్ట మేమీ కలుగలేదు. వానిలో రెండు విమానాలు పడగొట్ట బడ్డాయి. నాటిరాత్రిమాత్రం ఆంగ్లదేశపు తూర్పు, దక్షిణ తీరపు పట్నాలమీద విచ్చలవిడిగా బాంబులు పడ్డాయి. లండను నగరంలో మాత్రం ఎక్కడా బాంబులు పడలేదు. శుక్రవారం నాడుదయం చాల విమానాలు సముద్రతీరాన్ని దాటి లోపల ప్రవేశించడానికి ప్రయత్నించాయిగాని బ్రిటిషు విమానా లెదిర్చి తిరుగగొట్టివేశాయి. ఈ పోరాటంలో 7 శత్రు విమానాలు కూల్చబడ్డాయి. శుక్రవారం రాత్రి పశ్చిమతీరపు పట్నాలమీద చాల తీవ్రతరమైన దాడియే జరిగింది. వేలకొలది బాంబులు పడ్డాయి. ఆస్తికి కొంతనష్టం కలిగింది. ప్రాణనష్టం మాత్రం చాల తక్కువ. శనివారం రాత్రి ఒకటి రెండుచోట్ల స్వల్పమగు బాంబులు మాత్రం పడినవి. ఆదివారం రాత్రి యెచ్చటా శత్రుదాడిలేదనియే చెప్పాలి. సోమవారంనాడు శత్రు విమానాలు దండెత్తి ప్రవేశించుటకు ప్రయత్నించాయి గాని, బ్రిటిషు విమానాలు వానిలో 7 డింటిని పడగొట్టి మిగిలినవానిని తరిమివేశాయి. సోమ మంగళవారాలలో బ్రిటిషు దక్షిణతీరపు పట్నాలమీద, తూర్పుతీరాన శత్రువిమానాలు చిన్న దాడులు జరిపాయి కాని విశేషం నష్టం ఏమీ కలుగలేదు.

మే 18 వ తేదితో ముగిసిన వారంలో బ్రిటనుమీద 67 విమానాలు పడగొట్ట బడ్డాయి. ఏప్రిల్‌లో జరిగిన విమాన దాడులలో 6,065 మంది ప్రజలు మరణించారు. 6026 మందికి గాయాలు తగిలాయి

10 వ తేదిన ఇంగ్లాండులో దిగిన హెర్ హెస్సును ప్రభుత్వ విదేశాంగ శాఖాధికారులును హామిల్టను ప్రభువును చూచి సంభాషించి, వివరాలను చర్చిలు ప్రధానికి తెలియజేశారు. హెస్సు రాకవిషయమై ఇపుడు తానెట్టి ప్రకటనను చేయదలచుకోలేదని చర్చిలుగారు 20 వ తేదిన పార్లమెంటులో చెప్పెను. హెస్సును ఇపుడు సామాన్య యుద్ధ ఖైదిగానే చూస్తున్నారు.

### ఆఫ్రికా మధ్యధరా రంగాలు.

ఉత్తర ఆఫ్రికాలో (లిబియాలో) టొబ్రూకు దుర్గంవద్ద బ్రిటిషు సైన్యాలస్థితి ఇదివరకుకంటె అనుకూలంగ ఉంది. దుర్గములోనున్న సైన్యాలు చుట్టుముట్టియున్న శత్రుసైన్యాలపైన ఆకస్మికముగ పడి చాలనష్టం కలిగిస్తున్నాయి. శత్రుదాడులను తిరుగగొట్టి చాలమంది శత్రులను ఖైదీలుగా పట్టుకుంటున్నారు. 17 వ తేదిన 50 జర్మను సైనికులును ఇద్దరు సైనికాధికారులును పట్టుబడ్డారు. బ్రిటిషు సైన్యాలు తమ దుర్గాల వెలుపల మరికొంత ముందుకు ఆక్రమించుకొని శత్రులను వెనుకకు నెట్టివేశాయి. 18 వ తేదిన శత్రుల సింకను తరిమి, టొబ్రూకుకు వెలుపలనున్న దుర్గాలలో కొన్నిటిని తిరిగి ఆక్రమించుకోగలిగినాయి.

లిబియా ఈజిప్టు సరిహద్దులలో అగ్రభాగాలలోవున్న వుభయపక్ష సైన్యాలకు పోరాటాలు జరుగుచున్నాయి. ఆ పోరాటాలలో కొన్ని ప్రదేశాలు అనేకసార్లు చేతులు మారినవి. 15 వ తేదిన బ్రిటిషు సైనికులు శత్రుల వెనుకకు గొట్టి హాఫయాకనుమను, ముసాద్, సొల్లుం దుర్గాలను తిరిగి ఆక్రమించుకున్నారు. 16 వ తేదినాడు కోపుజో దుర్గం మీదకుకూడ జని 500 జర్మను సైనికులను ఖైదీలుగా పట్టుకున్నారు. కాని జర్మనులు 18 వ తేదిన కోలుకొని, గురువారమునాడు వదలుకొనిన ప్రదేశంలో చాలభాగం తిరిగి ఆక్రమించుకున్నారు. సొల్లుం పరిసరాలవరకు వచ్చారు.

బ్రిటిషు విమానాలు బెంఘాజీ, డెర్నా, డెనినా మొదలగు లిబియా రేవు దుర్గాలపైన ప్రతిదినం దాడులు సాగిస్తు ఈజిప్టు సరిహద్దులలోని శత్రుసైన్యాలకు సప్లయిలు అందకుండా చేస్తున్నాయి.

అబిసీనియాలో, అంబాఅలగీ దుర్గాన్ని బ్రిటిషు సైన్యాలు అన్నివైపులనుండి చుట్టుముట్టినవి. 8,000 ల సైన్యంతో లోపలనున్న ఇటాలియను రాజప్రతినిధియగు అయోస్టా ప్రభువు, ఆహారపదార్థాలు, మంచినీరులేక వ్యవహారములు చాల విషమించుటచేత ఇటాలియను ప్రభుత్వపు అనుమతి పొంది, 20 వ తేదిన బ్రిటిషు సైనికాధికారులకు లొంగి స్వాధీనమైపోయాడు. ఇక గోండార్, జిమ్మా దుర్గ ప్రాంతాలలో మాత్రం కొంత ఇటాలియను సైన్యం, అబిసీనియాలో ప్రతిఘటిస్తున్నది.

మధ్యధరా సముద్రంలో మాల్టాదీవిపైన, క్రీటుదీవిపైన, సైప్రస్ దీవిమీద, సూయజుకాలువ ప్రాంతముమీద జర్మను విమానాలు ప్రతిదినం దాడిసల్పుచు బాంబులు వర్షిస్తున్నాయి. మాల్టాపైన 15 వ తేదిన జరిగిన విమానదాడిలో ప్రజల ఆస్తులకు చాలనష్టం కలిగిందిగాని, నౌకాకేంద్రానికిగాని, విమానాశ్రయాలకుగాని ఏమాత్రము నష్టము గలుగలేదు. ఆనాడు క్రీటు ద్వీపంమీద జరిగిన దాడిలో 5 జర్మను విమానాలు పడగొట్టబడ్డాయి. ఈజియను సముద్రంలోని దీవులలో జర్మనులు తమ సైన్యాలను బలపరచుకుంటున్నారు.

20 వ తేది ఉదయం జర్మనులు విమానాలలోవచ్చి, క్రీటు ద్వీపంలో 1,500 సైనికులను దింపి, ఆక్రమించుటకు ప్రయత్నించారు. వారినందరనీ క్రిందవున్న గ్రీకు, బ్రిటిషు సైనికులు పట్టుకొన్నారు. మంగళవారంనాడు మరల 3,000 ల మందిని దింపారు. వారిలోకూడ చాలమంది ఖైదీలుగా చిక్కారు. మరికొందరు పోరాటంలో హతులైనారు. చిన్న నౌకలలోగూడ కొందరిని దింపుటకు శత్రువులు ప్రయత్నించారు. అక్కడ ఉభయపక్షాలకూ గురువారంనాటి కింకా పోరాటం జరుగుచునేఉన్నది.

## బాల్కనులు, టర్కీ, ఇరాన్, ఈరాక్.

ఈరాక్‌లో బ్రిటిషు సైన్యాలు విమానాలమీద ప్రతిదినం విశేషంగా దిగుతున్నాయి. తిరుగబాటుదారుల సైన్యాలను చితుకకొట్టి చెల్లాచెదరు చేస్తున్నాయి. తిరుగబాటుదారులకు, జర్మనీ, ఇటలీలు సిరియామీదుగ విమానాలను, మందుగుండు సామానులను పంపుచు సహాయం చేస్తున్నాయి. సిరియాలో ఫరాసు అధికారులు తమ విమానాశ్రయాలను జర్మనులచే ఉపయోగించుకొననిచ్చుచున్నందున 16 వ తేదినుండియు బ్రిటిషు విమానాలు సిరియాలోని విమానాశ్రయాలమీదను రేవు పట్నాలమీదను దాడివెడలి బాంబుల వర్షించుటకు ప్రారంభించాయి. 16 వ తేదిన సిరియామీదుగా, 30 జర్మను విమానాలు వచ్చి మోసలుప్రాంతంలో దిగి, అక్కడనుండి బ్రిటిషు సైనిక కేంద్రాలపై దాడి సాగించడం ప్రారంభించాయి. రాయల్ (సిరియా) విమానాశ్రయంనుండి 20 విమానాలు దాడులు సాగిస్తున్నాయి. బస్రా, హబ్బనియా ప్రాంతాలలో పరిస్థితులు బ్రిటిషువారికి చాల అనుకూలంగానే వున్నాయి. 18 వ తేదిన బస్రాకు 25 మైళ్ల దక్షిణంగావున్న పోలీసు ఠానాలను ఆక్రమించినవి. అచటి ప్రజలుప్రశాంతంగా వున్నారు. ఈరాకు విమానాలకు, సోవియటు రష్యా వైమానికులను పంపునను వదంతులు నిరాధారమైనవని సోవియటు అధికారులు ప్రకటించిరి. ఈరాక్-సోవియటు ప్రభుత్వాలు పరస్పరం రాయబారుల నియమించుకొనుటకుగాను ఉత్తరప్రత్యుత్తరాలు జరిగినట్లు 17 వ తేదిన రష్యను అధికారులు వెల్లడించారు. హబ్బనియాకు 15 మైళ్లు నైరుతిగా యూఫ్రెటీసు నదిమీదనున్న ప్రధానపట్టణమగు ఫల్లూజాను 19 వ తేదిన బ్రిటిషు సైన్యాలు ఆక్రమించాయి.

స్వతంత్ర ఫ్రెంచి పటాలాలు సిరియాలో ప్రవేశించాయని అచటి ఫరాసు సైన్యాలుగూడా విషీప్రభుత్వంమీద తిరుగబడుతున్నాయని వార్తలు వచ్చుచున్నవి.

ఈరాక్ బ్రిటిషు ప్రభుత్వాలకు ప్రారంభమైన ఈ సంఘర్షణలో మధ్యవర్తిత్వం చేయవలసినదని అమెరికా సంయుక్తరాష్ట్ర అధ్యక్షుడగు రూజ్వెల్టును, టర్కీలోని ఆఫ్గను రాయబారి కోరినట్లు అనుకుంటున్నారు.

టర్కీకివచ్చిన, ఈరాకు సైనిక మంత్రియగు పాకటు గారు 17 వ తేదిన తిరిగి వెళ్లిపోయాడు. 16 వ తేదిన, జర్మను రాయబారియగు వాన్‌పేపన్‌గారు, టర్కీ అధ్యక్షుడగు ఇనూను గారిని దర్శించి, టర్కీయుడల సంపూర్ణ స్నేహభావం తప్ప జర్మనీకి మరే యుద్దేశంలేదనియు, టర్కీనుండి ఆర్థిక వాణిజ్య సహకారం తప్ప తమ సైన్యములకు టర్కీగుండ త్రోవ ఇవ్వవలసినదనిగాని మరెట్టి హక్కులనుగాని సౌకర్యాలనుగాని జర్మనీ కోరుటలేదనియు నచ్చచెప్పినటుల తెలియుచున్నది. కాని టర్కీ అధికారులు పడమటి సరిహద్దు ప్రాకారాలను, తూర్పు సరిహద్దుదుర్గాలను, దక్షిణమందలి అలెగ్జాండ్రెటా రేవునుగూడ బలపరచుకొనుచు రక్షణ సన్నాహాల పూర్తి చేసుకొనుచున్నారు. 17 వ తేదిన టర్కీ ప్రభుత్వం 25-45 సంవత్సరముల మధ్య వయస్కులగు పురుషులందరును వెంటనేవచ్చి పటాలములలో చేరవలసినదని ప్రజలకు వుత్తరువుచేసింది.

గ్రీసు, యుగోస్లావియా దేశములనుండి జర్మనులు తమ సైన్యముల మరల్చుకొనుచున్నారు. గ్రీసు శాంతిని కాపాడుటకని బల్గేరియా సైన్యమున కప్పచెప్పబడునని వదంతులుగనున్నవి. ఇటుల మరలింపబడిన జర్మను సైన్యమును బల్గేరియా, రుమేనియా దేశములలోనుంచి తిరిగి మరియొక రంగమునకు సిద్ధ మొనర్చుచున్నారు.

క్రోషియాలో తిరుగబాటుదారుల తరపున, పావెలిచ్‌గారి నాయకత్వం క్రింద 18 వ తేదిన ఒక రాయబారవర్గం రోముకు వచ్చి, ఇటలీ రాజవంశమునుండి తమకొకరిని రాజుగా నొసగవలసినదని అడిగిరి. అంబేదో రాబర్టోరా కుమారుని ఇటాలియను ప్రభుత్వం ఇచ్చినది. అతనికి 18 వ తేదీననే రోములో, క్రోషియా రాజ్యాభిషేకం జరిగింది. ఇతను, అబిసీనియాలో ఇటాలియను రాజప్రతినిధిగనున్న అయోస్టా ప్రభువునకు తమ్ముడు.

## విషీ.

విషీ ప్రభుత్వాధ్యక్షుడగు పెటెయిన్ సేనాని 15 వ తేదిన ఫరాసు ప్రజలకు రేడియోలో ఉపన్యసిస్తూ, డార్లన్‌గారు జర్మనీతో చేసుకున్న ఒడంబడికయందలి సిద్ధాంతాలను తాను అంగీకరించితిననీ, జర్మనీతో జరుగుచున్న రాయబారములు సఫలమైతే, ఫ్రాన్సు పరాజయ నష్టముల తప్పించుకొని, తనకుగాని తన సామ్రాజ్యానికిగాని ఏ విధమగు నష్టమును లేకుండ బయటపడుననీ, దెలుపుచు, ప్రజలందరు తనయందు నమ్మకముంచి క్రమశిక్షణతో తనను అనుసరింపవలసినదని హెచ్చరించెను. ఫ్రాన్సు—జర్మనీ ఇటలీలతో సైనికంగాను మరి అన్నివిధములగూడ సహకారమొనర్చుటకు అంగీకరించినదని, యునైటెడు స్టేట్సు నౌకాశాఖ కార్యదర్శియగు కర్నలు నాక్సుగారు అన్నారు. ఈ

చర్య, ద్రోహ పూరితమైనదనియు, యుద్ధవిరామ షరతులకు మించి జర్మనీతో సహకార మొనర్చమని పెటెయిన్ సేనాని ఇదివరకు గావించిన వాగ్దానమునకు విరుద్ధమనియు రూజ్వెల్టు అధ్యక్షుడు ఖండించాడు. పశ్చిమార్ధగోళంలోవున్న ఫ్రాన్సు కాలనీలను అమెరికా రాష్ట్రాలు స్వాధీన మొనర్చుకొను విషయమై ఆలోచింపబడునని ప్రకటించాడు.

పెటెయిన్ సేనాని రూజ్వెల్టుకు జవాబిస్తూ, ఫ్రాన్సు యుద్ధ విరామపు ఒడంబడికను మీరి జర్మనీతో సహకారం సల్పుటలేదనీ, ఫరాసు విమానాశ్రయాలను జర్మనుల వశం చేయలేదనీ ఆయొడంబడికలోగల షరతుప్రకారం, సిరియాలోని విమానాశ్రయాలను జర్మనులనుపయోగించుకోన నియ్యవలసివచ్చిందనీ తెలియజేశాడు. 20 వ తేదిన, సిరియాలోని ఫరాసు గవర్నరగు డెంట్జుగారు—సిరియాను ఆక్రమించుకోడానికి యెవరైనా ప్రయత్నిస్తే, బలం ఉపయోగించి నిరోధిస్తామని ప్రకటించాడు. సిరియాలోవున్న బ్రిటిషు కౌన్సలుల నందరను వారం రోజులలో వెడలిపోవలసినదని 20 వ తేదిన డెంట్జు ఉత్తరువు చేశాడు. ఆంగ్ల ప్రభుత్వం, లండనులోని ఫరాసు కౌన్సలును వెళ్లిపొమ్మనినందుకు ప్రతీకారంగా ఈచర్య పుద్దేశింపబడినదని అనుకుంటున్నారు. అమెరికారేవులలోని ఫరాసునౌకలపైన సంయుక్త రాష్ట్రపు అధికారులు కాపలాపెట్టినందుకు, వాషింగ్టనులోని ఫ్రాన్సురాయబారి తీవ్రమగు అసమ్మతిని తెలియజేశాడు. సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం ఫరాసువారి మార్టినీ దీవిని ఆక్రమించుటకు ప్రయత్నిస్తే, అచట ఫరాసువారి బంగారము దాచియుంచబడిన పోర్టు పేల్చి వేయబడును గాని అమెరికనుల చేతిలో పడనీయమని, పారిస్ నగరపు రేడియోలో 20 వ తేదిన ప్రకటింపబడింది. ఫ్రాన్సు-జర్మను సంభాషణలు సంతృప్తికరముగానే జరుగుచున్నవనియు ఈలోగా లక్షమంది ఫ్రెంచి సైనిక ఖైదీలను జర్మనీ వెంటనే వదలిపెట్టనున్నదనియు ప్రకటించబడెను.

అమెరికా—అట్లాంటికు.

అమెరికానుండి ఆయుధ సామగ్రిని ఆంగ్ల దేశమునకు సురక్షితముగ చేర్చుటకు అమెరికా నౌకాదళము సిద్ధముగ నున్నదని, సంయుక్త రాష్ట్ర ప్రభుత్వ నౌకాదళ శాఖ కార్యదర్శి 16 వ తేదిన ప్రకటించెను. అమెరికా రేవులలోని అక్ష రాజ్యాల నౌకలను పట్టుకొని, వానిని ఉపయోగించుకొనుటకు ప్రవేశ పెట్టబడిన చట్టము, సెనేటు సభవారిచే ఆమోదింపబడెను. విదేశీయాంగ కార్యదర్శియగు కార్డెలు హల్లుగారు 18 వ తేదిన అమెరికా ప్రజలకు ఉపన్యసిస్తూ ఆయుధసామగ్రిని సురక్షితంగా బ్రిటనుకు చేర్చడానికి, యునైటెడు స్టేట్సు కృతనిశ్చయమైయున్నదనియు, అందుకు ఏదో ఉపాయం కనుగొనబడుననియు ప్రకటించెను. పశ్చిమార్ధగోళమునగల ఫ్రెంచి రాజ్యములను, నౌకలు మొదలగు ఆస్తులనుకొనివేయుటకు ప్రభుత్వమువారికి అధికారమిస్తూ, యునైటెడు స్టేట్సు శాసన సభలో ఒకరు ఒక చట్టము ప్రతిపాదించిరి. రూజ్వెల్టు అధ్యక్షుడు, ఉత్తర ఆఫ్రికా ఖండమును పడమటి తీరమువరకును పోర్చుగలుకు సమీపముగనున్న అజోర్సు దీవుల వరకునుగూడ యునైటెడు స్టేట్సు యొక్క రక్షణలోనికి తీసుకుంటూ, వెనుకటి శుక్రవారం నాడు శాసన సభల కొక సందేశమునంపుటకు ఉద్దేశించెననీ, అట్టి సందేశమంపియున్న యెడల పైకి ప్రకటింపబడక పోయినా, యునైటెడు స్టేట్సు యుద్ధంలో ప్రవేశించినట్లయ్యేదనీ, కాని శాసన సభలోని ప్రముఖులు—నిరుత్సాహపరచుటవలన మానివేసెననీ 20 వ తేదిన తెలియవచ్చినది. యుద్ధ సామగ్రి బ్రిటనుకు సురక్షితంగానే జేరుచున్నదనీ, అందుచే ఈ విషయమై యునైటెడు స్టేట్సు ప్రస్తుత మెట్టి చర్యను తీసుకొననవసరములేదని, సెనేటులో ప్రభుత్వ నాయకుడగు బార్క్లీగారు 20 వ తేదిన వెల్లడించారు. యునైటెడు స్టేట్సువారు 200 వర్తకనౌకలను నిర్మించుకొనుట కేర్పరుచుకొనినపని, అనుకొనినదానికంటె 2 వారములుముందుగా ప్రారంభింపబడెనని అధికారులు ప్రకటించిరి.

తటస్థ రాష్ట్రాలు (రష్యా-స్పెయిను వగైరా).

దక్షిణ అమెరికానుండి సరకుల తెచ్చుచున్న రష్యను నౌకను, యునైటెడు స్టేట్సు అధికారులు పట్టుకొని తీసుకుపోయినందుకు సోవియటు రాయబారి, 15 వ తేదిన యునైటెడు స్టేట్సు ప్రభుత్వమునకు అసమ్మతిని తెలియజేసెను. రష్యాలో నున్న విదేశీయ రాయబారులు గాని, వారి తాలూకు సిబ్బందిగాని, బంధుమిత్రులుగాని, తమ నివాసమును విడచి ఇతరప్రాంతములకు జనుటకు అనుమతి పత్రముల నందవలసియుండుననియు, రష్యాలో ఆర్కేంజిల్, మర్మినిస్కు—లెనిన్ గ్రాడ్ ప్రాంతములు, క్రొత్తగా ఫిన్లండు యుద్ధం తరువాత యేర్పడ్డ కరిలియా ప్రాంతమును, ఎస్తోనియా, ట్వియా మాల్డేవియా ప్రాంతములను యుక్రేనియా, క్రిమియా, బాకూప్రాంతములను విదేశీయ రాయబార సిబ్బంది-అసలు ప్రవేశించుటకే వీలులేదని ఉత్తరువులు గావింపబడెననియు 17 వ తేదిన స్విట్జర్లండు రేడియో ప్రకటించింది.

కొలది వారాలలో హిట్లరు స్వయంగా సోవియటు రష్యా ప్రధానియగు స్టాలినును కలసికొనుటకు యేర్పాటులు జరుగుచున్నవనియు, జర్మనీ-రష్యాలు చాల వత్సరములవరకు కలసి పనిచేయుటకుగాను యేర్పాటులనుగురించి అపుడు చర్చించుకొనబడుననియు, భారత దేశమును, ఇతర ఆసియా దేశములను సోవియటు రష్యాకు వదలివేయుటకు హిట్లరు సూచింపనున్నాడనియు న్యూస్ క్రానికల్ పత్రిక రాజకీయ విలేఖరి తెలుపుచున్నాడు. యుక్రేనియా ప్రాంతంలో స్టాలినో నగరమువద్ద, దేశ రక్షణ సైనిక విన్యాసములు జరిగెననియు 13 వేలమంది ప్రజలీ విన్యాసంలో పాల్గొనిరనియు, సోవియటు రేడియో 19 వ తేదిన ప్రకటించినది. జపాను-రష్యా నిరాక్రమణ యొడంబడిక ధృవపరుపబడినదని తెలుపు అంగీకార పత్రాలను 20 వ తేదిన ఉభయ ప్రభుత్వాలు పరస్పరం అందజేసుకున్నాయి. సోవియటు సైన్యములు పర్షియా సరిహద్దుల ప్రాంతంలో టాష్కెంటువద్ద 18 వ తేదిన పెద్ద సైనిక విన్యాసాలు ప్రారంభించినవనీ, చాలసైన్యము అక్కడ కేంద్రీకరింపబడెవనీ న్యూయార్కు టైమ్సు విలేఖరి తెలుపుచున్నాడు. బల్గేరియా, రుమేనియా ప్రాంతాలలోనున్న జర్మను సైన్యమును, ఆయుధసామగ్రిని ఈరాక్, పర్షియా దేశాలకు చేర్చుటకు నల్ల సముద్రంలోని రష్యను నౌకలనుపయోగించుకొన నిచ్చు విషయమై ఉభయ ప్రభుత్వాలకు సంప్రదింపులు జరుగుచున్నవని గూడ ఆ విలేఖరియే తెలిపెను.

స్పెయినులో, నియంతయగు ఫ్రాంకో సేనానికి బావమరదియు, విదేశాంగమంత్రియునగు సెనరు సూనరుగారు, తమ మంత్రి పదవికి రాజీ నామానిచ్చిరి. కాని ఫ్రాంకో సేనాని దానినంగీకరింపలేదు. సూనరుగారికిప్పటికంటె యెక్కువ అధికారము లొసగువిషయమును ఆలోచించుటకు గాను 18 వ తేదిన స్పెయిను మంత్రివర్గము సమావేశమయ్యెను. ఈలోగా, సూనరుగారి ఫలాంగిస్టు పక్షసభ్యులగు ఇర్వురు ప్రముఖులు, వార్తాపత్రికా-ప్రచార శాఖలో ఉద్యోగములనుండి తొలగింపబడిరి. పత్రికా—ప్రచురణ శాఖలను పూర్తిగ సూనరుగారి ఫలాంగ్ పక్షపు

అధికారమునందుంచుటకు మంత్రివర్గమువారు నిర్ణయించిరి.

ఇంతవరకును డెన్మార్కునకు కాలనీగనున్న అయిస్లాండునందు శాసన సభ సమావేశమై డెన్మార్కు ప్రభుత్వంతో సంబంధమును త్రెంపుకొని, స్వతంత్రమగు ప్రజాప్రభుత్వమును నెలకొల్పుకొనుచు ప్రకటనల గావించెను.

### దూరప్రాచ్యం.

చైనా దక్షిణ భాగంలోను, మధ్య ప్రాంతాలలోను ఈ వారం, జపాను-చైనా సైన్యాలకు చాల తీవ్రమగు పెద్ద యుద్ధాలు జరిగినవి. హూపే రాష్ట్రాలలో శత్రు సైన్యాలకు 10 వేల నష్టం కలిగించి తిరుగగొట్టితిమని చైనీయులు చెప్పుచున్నారు. పాన్సీ, హూనాన్ రాష్ట్రంలో 5 వ చైనా సైనిక దళం నిర్మూలించబడెననీ 7,000 మంది ఖైదీలుగా పట్టుకొనబడెననీ జపానీయులంటున్నారు.

వేర్వేరు రంగాలలో తాము గెల్చితిమని ఉభయులును ప్రకటించుకొనుచున్నారు. దక్షిణ షాన్సీలోగూడ ఇప్పుడిప్పుడు యుద్ధం చైనీయులకు అనుకూలంగా మారుతున్నదని 20 వ తేదీన చైనా అధికారులు ప్రకటించారు. చైనా రాజధానియగు చుంకింగుమీద ఇతర విమానాశ్రయాలమీద 20 వ తేదీన 75 జపాను విమానములు దాడి సాగించి బాంబులు వర్షించాయి. మధ్య రాష్ట్రాలలో జరుగుచున్న యుద్ధంలో సహాయం చేయవలసినదని చాంగ్ కైషెకు సేనాని 8 వ కమ్యూనిస్టు సైనికదళానికి 20 వ తేదీన విజ్ఞప్తి చేశాడు. కమ్యూనిస్టులు యుద్ధంలో చేరడంలేదని మీదు మిక్కిలి తిరుగుబాటు చేయడానికికూడా సిద్ధంగా వున్నారని జపానీయులు అంటున్నారు.

### నౌకా నష్టాలు.

19 వ తేదితో ముగిసిన వారంలో 50 వేల టన్నుల పరిమాణంగల శత్రు నౌకలు ముంచివేయబడెనని బ్రిటిషు అధికారులు ప్రకటించారు.

అమెరికానుండి వైద్య సహాయక దళాలను వాలంటియరులను తీసుకొని వెళ్లుచున్న "జాంజాం" అను ఈజిప్టు స్టీమరు అట్లాంటికులో ముంచివేయబడెను. అందరి ప్రయాణీకులు సురక్షితంగానే వున్నారని జర్మనులు ప్రకటించారు.



బ్రిటిషు దేశీయుల ధైర్యస్థైర్యములు. ఒక సముద్రప్రాంత స్థానమును కాపాడు కాల్బలములును, చర్చిల్ గారును.

## సూయజు కాల్వ కొరకు యుద్ధం.

బ్రిటిషు ప్రభుత్వంవారు భగీరథ ప్రయత్నంచేసి స్వాధీనపరచుకొనిరి.

మధ్యధరా సముద్రమును ఎర్ర సముద్రమును కలుపుచున్నట్టి సూయజు కాల్వ బ్రిటిషు సామ్రాజ్య దేశములను కలిపే లంకెవంటిది. ఇది 1869 వ సంవత్సరమున రాదారి మార్గముగ తెరువబడినది. ఫెర్డినాండు డిలెస్సు అను ఫ్రెంచి ఇంజనీరుయొక్క అసమాన ప్రజ్ఞ దీని నిర్మాణమునకు కారణమయింది. కాని దీనిని బ్రిటిషువారి స్వాధీనంలోనికి తెచ్చిన ఖ్యాతి విక్టోరియా రాణి ప్రధానియగు డిజ్రేలిగారికి చెందింది.

క్రీస్తు శకమునకు పూర్వమే యిటువంటి నీటిమార్గం ఉండ వలసిన అవసరం గుర్తించబడింది. ఈజిప్టు దేశపు రాజులగు ఫారోవాలు నైలునదిని ఎర్ర సముద్రముతో కల్పుచు ఒక రాదారి కాల్వ త్రవ్వించియుండిరి. ఫిలడిల్ఫస్ అను రాజు ఆఫ్రికా, ఆసియా ఖండములను కలుపునట్టి భూసంధిని చీల్చి సూయజుకాల్వను త్రవ్వవలెనని తలపెట్టెను. కాని ఎర్ర సముద్రం నీటిమట్టం మధ్యధరా సముద్రంకన్న ఎత్తైనదను నమ్మకంతో యీ కాల్వ త్రవ్వితే దేశమంతా వరదలో మునుగుతుందని భయమేసి మానుకొనెను. యూరోపునుండి ఇండియా, చీనా దేశాలకు ఉత్తరమున నేలమార్గము కనిపెట్ట బడినందునను, వాస్కో-డగామా యను పోర్చుగీసు నావికుడు ఆఫ్రికాను చుట్టివచ్చు కేపు ఆఫ్ గుడుహోపు మార్గంను ఇండియాకు కనిపెట్టినందునను సూయజుకాల్వ సూచన కొంతకాలం వెనుకపడింది.

## ఫ్రాంసు పట్టుదల.

కాని ఫ్రాంసులో మాత్రం సూయజుకాల్వను కట్టాలనే అభిలాష తగ్గలేదు. 1798 లో నెపోలియను చక్రవర్తి ఈజిప్టు దేశంపైకి దాడి వెడలుటకు కారణాలలో యీకాల్వ కట్టాలనే ఉద్దేశం ఒకటి. పారిసులో "సొసయిటి డి ఇటుడి సొడు కనాలుడి సూయజు" అను వివిధ దేశాల పెట్టుబడిదారులు గల కంపెనీ యీపని తలపెట్టెను. అపుడు ఈజిప్టు-టర్కీ సామ్రాజ్యం క్రిందనున్నది. ఈజిప్టులో టర్కీ వైస్రాయి యగు మహమ్మదాలిగారు యిందుకు ప్రతికూలంగా ఉండిరి. బ్రిటిషు ప్రభుత్వంవారు గూడ విముఖంగానే యుండిరి. వారు అలగ్జాండ్రియా నగరంనుండి సూయజుపురంవరకు రైలుమార్గం వేయదలచిరి. ఈ రైలు వేసినచో ఈజిప్టులో బ్రిటిషువారికి అధికారం ఎక్కువగునని ఫ్రెంచివారి భయం. అందుచే వారు సూయజుకాల్వను గూర్చి ఎక్కువ పట్టుదలగ ఉండిరి. మహమ్మదాలిగారు రెండు సూచనలకు విరుద్ధంగా ఉండిరి. కాని వారి తరువాత వైస్రాయిగా వచ్చిన అబాసు పాషాగారు 1851 లో ఇంగ్లీషువారు కోరిన రైలుమార్గానికి అనుమతియిచ్చిరి. ఆ రైలు మార్గం సూయజువరకు 1858 లో వేయబడెను.

తూర్పు దేశాలతో వర్తకం ఎక్కువైన కొలది దగ్గర త్రోవకై సూయజుకాల్వను త్రవ్వించవలసిన అవసరం ఎక్కువైంది. ఫెర్డినాండు డిలెస్సెప్సుగారు పట్టుదలతో పనిచేసిరి. ఈజిప్టుకుపోయి అప్పటి వైస్రాయి సయ్యదు పాషావద్ద 1854 లో కాల్వకట్టుటకు అనుమతి బడసిరి. కాని టర్కీ సుల్తాను అనుమతికూడా బడయందే కాల్వ పని ప్రారంభించరాదని అతడనెను. ఈ కాల్వ ఫ్రెంచివారి దయిపోతే, వారికి అధికారం ఎక్కువవుతుందనే భయంచేత బ్రిటిషు ప్రభుత్వంవారు టర్కీ దర్బారులో తమ పలుకుబడి నుపయోగించి సుల్తాను యిందుకనుమతించకుండా చేస్తూ వచ్చేరు. ఫెర్డినాండు డిలెస్సెప్సు చాల ధైర్యవంతుడు, స్థిరసంకల్పం గల ప్రతిభాశాలి. అతని శిలావిగ్రహం యిప్పటికీ పోర్టుసైడు రేవులోగలదు. అతడు 1858 లో 400,000 వాటాలతో ఒక కంపెనీని స్థాపించెను. వాటాలలో సగానికి పైగా ఫ్రెంచివారివే. సుల్తాను అనుమతి పొందకుండానే 1859 వ సం॥ ఏప్రిల్ 25 వ తేదిన కాల్వ త్రవ్వించు పనిని అతను ప్రారంభించెను. ఎన్నో తంత్రాలు జరిగిన పిమ్మట 1866 లో సుల్తాను అనుమతించెను. పని త్వరగా ముగిసి 1869 వ సం॥ నవంబరులో కాల్వ తెరువబడెను.

ఈ కాల్వ మధ్యధరా సముద్రంనుండి సన్నగా మంజిలే సరస్సువరకు పోయి, అటనుండి ఒక మైదానంగుండా ఐదు మైళ్లువరకు పోయి బాలా సరస్సులో పడును. అటనుండి చదునైన ప్రదేశంగుండా టింసా సరస్సువరకు నాల్గు మైళ్లు పోవును. తరువాత బిట్టరు సరస్సులలో పడును. అవి 20 మైళ్లవరకు గలవు. ఆ సరస్సులనుండి సూయజునగరంవరకు సన్నగా పోవును. సూయజు ఎర్రసముద్రం ఉత్తరకొననున్న రేవుస్థలం. కాల్వ మొత్తం పొడవులో 3 వ భాగం సరస్సులే గలవు. మొత్తం నిర్మాణ వ్యయం 432,807,882 ఫ్రాంకులు (ఫ్రెంచి నాణెములు).

## ఇంగ్లాండు వశపరచుకొనుట.

ఇంగ్లాండు నౌకా ప్రాధాన్యతగల వర్తకదేశం కనుకను, ఇండియాతో వర్తకం ఎక్కువ కనుకను, యీ కాల్వ యొక్క ఉపయోగమును బాగా గుర్తించెను. 1875 లో ఈజిప్టు పాలకుడగు కేడివు ఇస్మేలు పాషాకు డబ్బుకావలసివచ్చి, సూయజుకాల్వ కంపెనీలో తనకుగల వాటాలను అమ్ముటకుగాని తాకట్టు పెట్టుటకుగాని ఫ్రెంచి బ్యాంకులతోను రాయబారాలు జరుపుచుండెను. ఆ విషయం తెలిసి బ్రిటిషు ప్రధాని డిస్రేలి తన మిత్రుడగు బాంకు యజమాని రాతుచైల్డు ప్రభువుద్వారా బ్రిటిషు ప్రభుత్వం తరఫున 176,602 వాటాలను 3,976,580 పౌనులకు (సవరలు) కొనివేసెను. వ్యవధిలేక పోయినందున బ్రిటిషు పార్లమెంటు అనుమతినిగూడ ముందుగ బడయలేదు. అప్పటికినీ కంపెనీలో ఫ్రెంచివారి వాటాలే ఎక్కువగ ఉన్నాయి. పరిపాలకవర్గమునందు వారిమాటే బలంగాఉంది. ఇంతలో ఈజిప్టు దేశమునందు జాతీయోద్రేకంకలిగి తిరుగుబాటు జరిగెను. సూయజుకాల్వను కాపాడే పూచీ ఈజిప్టుపై గలదు. ఈజిప్టులో అరాచకంవలన కాల్వ భద్రతచెడే అవకాశం ఏర్పడింది. ఫ్రాంసు తనకేమి అవసరంలేదన్నట్లు ఊరుకోగా బ్రిటిషు ప్రభుత్వం జోక్యం కలిగించుకొని, తిరుగుబాటును అణచివేసెను. అప్పటినుంచి ఈజిప్టు బ్రిటిషు వారి సామంత రాజ్యమయ్యెను; ఫ్రెంచివారి పలుకుబడి తగ్గెను.

## కాల్వ అధికారం: ఒడంబడిక.

యూరోపు-ఆశియా వర్తక వాణిజ్యములకు ప్రాణప్రదమైన యీ కాల్వ భద్రంగా కాపాడబడుటకై అన్ని దేశాల మధ్య ఒక ఒడంబడిక అవసరమని తోచెను. ఇందునుగూర్చి పారిసునగరంలో జరిగిన సభయందు ఇంగ్లాండు-ఫ్రాంసు ప్రభుత్వములకు ఏకీభావం కుదురలేదు. ఎట్లయితేనేం, 1888 వ సంవత్సరములో టర్కీ ముఖ్యపట్టణమగు కాంస్టాంటినోపుల్‌నందు యీ పెద్ద రాజ్యాలకు ఒడంబడిక కుదిరెను. దాని ప్రకారం "సూయజుకాల్వ మార్గం యుద్ధ సమయములందు శాంతి సమయములందుగూడా అన్ని దేశాల నౌకలకు, యుద్ధ నౌకలకు వర్తక నౌకలకు సహా, తెరచి యుంచబడవలెను. అందుచే శాంతి సమయానగాని యుద్ధ సమయానగాని కాల్వ స్వేచ్ఛగ ఉపయోగించబడుటకు విదేశంకూడ అడ్డుతగలదు. కాల్వ మార్గము మెన్నడు నిషేధ విధానమునకు గురికారాదు." ఈ ఒడంబడికను అనుసరించే అబిసీనియా యుద్ధంలోకూడ తమ శత్రువగు ఇటలీ సైనిక నౌకలను ఇంగ్లాండు సూయజుకాల్వగుండా పోనిచ్చెను.

## కాల్వ వివరములు.

సూయజుకాల్వ 103 మైళ్ల పొడవున్నది. కనీసపు వెడల్పు 196 అడుగుల 10 అంగుళాలు. కొన్ని చోట్ల అంతకన్న ఎక్కువ వెడల్పేగలదు. నౌకలు పోవునపుడు

34 అడుగుల నీరు వదలబడును. కాల్వలో నౌకల ప్రయాణం 11 గంటల 31 నిముషములుండును. ఈ కాల్వ మార్గానవస్తే ఇండియా యూరోపునకు 5,000 మైళ్లు దగ్గరయగును. కాలక్రమేణ యీ కాల్వ వాడుక యెక్కువైనది. ఇందు పోయే సామాను స్టీమరులు కంపెనీకి 15,900 పౌనులు రుసుము చెల్లించాలి. ప్రయాణీకుల నౌకలు సుమారు 9,000 పౌనులు చెల్లించాలి. 1938 వ సంవత్సరములో 6,173 నౌకలు యీ కాల్వ ద్వారా పోయినవి. ఇందులో ఇంగ్లీషువారివి 3,000. ఆ ఏడు 28,77,900 టన్నుల సరకు యీ కాల్వగుండా రవానా చేయబడింది.

## బ్రిటిషు అధికారం.

బ్రిటిషువారు యీ కాల్వను సర్వదా తెరచియుంచుటకే శ్రద్ధ వహించుచుండిరి. గత యుద్ధంలో బెర్లిను నగరం నుండి బాగ్దాదువరకు రైలు మార్గం వెయడానికి ప్రయత్నం చేసేటప్పుడు, యూరోపు ఆశియా ఖండాలకు వేరే మార్గం ఏర్పడి యీ కాలువకు నష్టం వస్తుందేమోనని కూడ బ్రిటిషువారు అనుమానించేరు. కాని గత యుద్ధంలోను యీ యుద్ధంలోను కూడా తేలిందేమిటంటే, మధ్యధరా సబుమెరైనులు, విమాన దాడుల బాధ యెక్కువైంది కనుక తూర్పు దేశాలకు ఆఫ్రికానుచుట్టే కేపు మార్గమే శ్రేయస్కరమని. అందుచే సూయజు కాల్వ మార్గం బ్రిటిషు సామ్రాజ్యానికి ప్రాణప్రద మయినదిగా యెంచబడలేదు.

1914 వ సంవత్సరములో గత యుద్ధం ప్రారంభం కాగానే టర్కీ జర్మనీతో చేరినపుడు దాని సామంత రాజ్యమగు యీజిప్టు మిత్రమండలితో చేరింది. అపుడు సూయజు కాల్వను కాపాడే బాధ్యత ఈజిప్టునుండి ఇంగ్లాండు తీసుకుంది. కాంస్టెంటినోపుల్ ఒడంబడిక ప్రకారం టర్కీ సామ్రాజ్య ప్రభుత్వంపై యీ బాధ్యత యుండెను. దీనికి బదులు యిపుడు బ్రిటిషు ప్రభుత్వమున కొసంగుచు ఒడంబడిక మార్చబడెను. ఈజిప్టు ప్రభుత్వం శైశవావస్థయందున్నందున కాల్వ కాపలా బాధ్యత దాని కొప్పగించలేదు. 1936 వ సంవత్సరపు ఈజిప్టు-ఇంగ్లాండుల ఒడంబడిక ప్రకారం కాల్వ రక్షణ భారం వహించుటకు ఈజిప్టు సైన్యం తగినశక్తి కలిగియుందని అన్ని దేశాలకు నమ్మకం కలిగేవరకు బ్రిటిషు సేనలే దాన్ని కాపాడుచు ఉండాలని నిర్ణయించబడెను.

## నేడు శత్రువుల ఆశలు.

సూయజు కంపెనీ అనుమతిపత్రం 1968 వ సం॥ నవంబరులో కాలదోషంపట్టి, కాల్వ ఈజిప్టు సొత్తై పోతుంది, కాల్వలో వసూలయ్యే రుసుమంతా యీ కంపెనీకి పోతున్నదే అని ఇటలీ దుఃఖపడుచున్నది. జర్మనీ కాల్వ ప్రాంతాలపై దాడి సలుపుచున్నది. ఇటలీకి ఆఫ్రికా సామ్రాజ్యం పెంచాలన్న ఆశ యింకా పోలేదు. అందుచే ఈజిప్టు, చేరువ ప్రాచ్యదేశాల యుద్ధాలు సూయజు యుద్ధంగ మారతాయని ఇంగ్లాండుకి తెలుసు. కావున సూయజు కాల్వకు వాణిజ్య ప్రాముఖ్యతకన్న రాజకీయ ప్రాముఖ్యత ఎక్కువేగలదు. ఆశియా ఆఫ్రికా ఖండములు రెండు వైపుల నుండి సూయజుపైబడి, మధ్యధరా సముద్రమునకు ఆ మార్గమును బంధించి, అలగ్జాండ్రియాలోనున్న బ్రిటిషు నౌకాదళానికి దిగ్బంధన చేయాలని జర్మనీ ఆశించుచున్నది. కాని ఇంగ్లాండు ఊరుకుంటుందా? జర్మను సేనలను ఎన్నింటినో బలిచేసి ఎర్రసముద్రంతోపాటు సూయజు కాల్వలో నీరుగూడ వారి రక్తంతో ఎర్రగా చేయక మానదు.

# అబిసీనియాలో బ్రిటిషు విజయం.

## అంబా అలాగి పతనం.

అబిసీనియా ముఖ్యపట్నమగు అడిసుఅబాబా పడిపోయిన తరువాతగూడ, ఇటలీ వైస్రాయియు సేనాధిపతియునగు అయోస్టా ప్రభువు రక్షించుకొనుచుండిన అంబా అలాగిదుర్గం బ్రిటిషువారికి వశమయిందని కైరోనుండి 19 వ తేదీనవచ్చిన ప్రకటన సామ్రాజ్యమంతకు ఉషారు కలుగజేయును. బ్రిటిషు సేనలు మిక్కుటముగా చుట్టువేసినందున తప్పించుకోలేక ఆతడు ఒక రాయబారినంపి, బ్రిటిషువారి షరతులు తెలుసుకొని అంగీకరించి, లొంగిపోయెను. "గాయపడినవారిని చేర దీసుకొనుటకు ఒక దినం గడువొసంగిన పిదప, సైన్యమంతా నేడు ఘనవశమగుచున్నది. అయోస్టా ప్రభువుకోరిన ప్రకారం ఆతడు స్వంతపరివారంతో అందరికన్న ఆఖరికి రేపు 20 వ తేదీన వశమగును." అని ప్రభుత్వ ప్రకటన గలదు. ఇతర చోట్ల వానలు విపరీతంగా ఉన్నా బ్రిటిషు సేనలు కొన్ని దుర్గములను, 800 ఖైదిలను, రెండు ఆయుధ మోటారులను, రెండు ఫిరంగులను వశపరచుకొన్నవి.

అయోస్టా ప్రభువు ధైర్యంకు మెచ్చి బ్రిటిషువారు యుద్ధగౌరవ చిహ్నము లొసంగ నిశ్చయించిరి. ముసోలినీకి ఆతడు "మానవ శక్తికి సాధ్యమయినదంతా చేసేననే సంతృప్తి నాకు గలదు" అని తంతినంపెను. "ఇటలీ ప్రజలు మీ చర్యను ప్రశంసించిరి" అని ముసోలిని బదులు తంతినంపెను.

చిత్రమేమంటే, అయోస్టా ప్రభుని సోదరుడు స్పోలిటో ప్రభువు క్రోషియాదేశానికి రాజుగా జర్మనీచే నియమింపబడిన రోజునే యీతడు శత్రువుకి లొంగిపోయెను. ఇక ముందు అబిసీనియాలోని బ్రిటిషు సేనలు లిబియా ఈజిప్టు రక్షణకు పోగలవు.

# ఫ్రాంసు ప్రభుత్వం జర్మనీకి పూర్తిగ లొంగిపోవుట.

## అమెరికా ఆగ్రహం: తన చేరువకు జర్మనీ రాకూడదనుట.

జర్మనీ ప్రభుత్వమునకు విషీ ప్రభుత్వమునకు తిరిగి రాయబారములు జరుగుచున్నవి. జర్మనీకి లొంగిపోయి సగం రాజ్యం యిచ్చివేసి మిగిలిన సగాన్ని స్వతంత్రంగా పరిపాలిస్తున్నామంటున్న విషీ ప్రభుత్వాధికారి మార్షలు పెటేను నాజీలకును తన దేశంలోని విద్రోహులకును లొంగిపోవలసి వచ్చెను. అతని ప్రధానియగు డార్లాను అదివరకుండిన లావెలుకన్న ఎక్కువ జర్మను పక్షపాతి. క్రొత్తగా తలపెట్టిన ఒడంబడిక షరతులవలన ఫ్రాంసు సరిహద్దులు కొంచెం

మారును; జర్మనీకి సాలీనా కట్టుబడి 4,000 లక్షల ఫ్రాంకుల నుండి 3,000 లక్షలకు తగ్గును. 100,000 ఫ్రాంసు ఖైదీలు విడవబడుదురు. హిట్లరు తనకేమి లాభంలేనిది యీ మాత్రం సౌకర్యాలేనా ఫ్రాంసుకివ్వడు. కావున దీనికి బదులుగ, ఫ్రెంచివారి వలసరాజ్యమగు సిరియాలోనికి జర్మను సేనలను రానిచ్చి, అటునుండి ఇరాకుపైకి సూయజు కాల్వపైకి దుముకుటకు అవకాశమిచ్చెను. సిరియాలోని ఫ్రెంచి గవర్నరు యీచర్యను సమర్థించుట వింతగనున్నది. జర్మను సేనలను బ్రిటిషువారు బాంబులతో కొట్టరాదనడం విపరీతంగా ఉంది. సిరియానుండి రైళ్లమీద యుద్ధసామగ్రికూడ జర్మను సేనలకు పంపబడుచున్నది. ఇంత చేస్తూ, యిదంత గతసంధి నియమముల కనుగుణ్యంగానే ఉందనడం కుట్రమాటలు తప్ప వేరుకావు.

విషీ-జర్మను ప్రభుత్వాల రాయబారాలు అమెరికాకు చాల ఆగ్రహం కలిగించినవి. ఇవి కేవలం సైనిక చర్యలకు సంబంధించినవేననియు, ఉత్తర ఆఫ్రికా, పడమరాఫ్రికాలలోనేగాక, పడమటి ప్రపంచమగు అమెరికాలోనున్న ఫ్రెంచి రాజ్యభాగాలలోగూడ జర్మనులకు తావాసంగబడుననియు అమెరికా మంత్రి కార్డెలుహల్లుగారు సూచించిరి. స్వాతంత్ర్యమును స్వేచ్ఛను ప్రజాప్రతినిధి సంస్థలన్నిటిని ధ్వంసంచేయబూనిన సైనిక శక్తితో ఫ్రాంసు చేయికలుపుట వింతగ ఉందని అధ్యక్షుడు రూజువెల్టుగారన్నారు. పడమటి ప్రపంచంలో ఉన్న ఫ్రెంచి రాజ్యభాగాల ప్రభుత్వం మారేటట్లుంటే, ఆ భాగాలను తామే ఏల తీసుకోరాదో యితర అమెరికా స్వతంత్ర రాష్ట్రాలతో కలసి యోచించవలసియున్నదని అధ్యక్షు రూజువెల్టుగారన్నారు. ఫ్రాంసు-జర్మనీలు అమెరికా ప్రాంతాల వలసరాజ్యాలను మార్చుకొనుటగూర్చిగూడ ఆలోచిస్తున్నట్లయితే, వాటిని తీసుకొని స్వతంత్ర పరిపాలనా విధానం ఏర్పాటు చేయుటకు అమెరికాలో 21 ప్రజాస్వామ్య ప్రభుత్వాలు సిద్ధంగా ఉన్నాయన్నారు.

మార్టినిక్, ఫ్రెంచిగయానా, గ్రుడిలోపు, సేంటుపియరీ, మైకిలాను అనుదీవులు అమెరికా సముద్రాలలోనున్నవి ఫ్రెంచివారివి. ఈ దీవులలోనికి జర్మనీని ఎన్నడు అమెరికా రానివ్వదు.

## జపాను చర్య

### దక్షిణ దాడి నెదుర్కొనుటకు ఇంగ్లాండు, అమెరికా, ఆస్ట్రేలియాలు సిద్ధంగా ఉన్నాయి.

జపాను కొంతకాలం క్రిందట రషియాతో ఒడంబడిక గావించుకోగానే మంచూరియానుండి విడుదలై వచ్చిన సేనల సహాయంతో నాల్గు రంగాలందు ఒకేసారి ప్రారంభించిన యుద్ధం గూర్చి పరస్పర విరుద్ధ వార్తలు వచ్చుచున్నవి. మూడు చోట్ల జపాను యత్నం విఫలమయినప్పటికి చీనాలోని షాంషి రాష్ట్రమునందు జపాను కొంత విజయం గాంచినది. హానః నది, ఎల్లో నది ప్రాంతములందు మాత్రం జపాను సేనలు దాడి విరమించుకోవలసివచ్చెను. చీనావారు యుద్ధం తమ కనుకూలంగా మరలుచున్నదంటున్నారు. రషియాతో గావించుకొన్న వస్తువులకు వస్తువులను పుచ్చుకొను ఒడంబడిక ప్రకారం చీనాకు ఆయుధాలు విపరీతంగా రష్యా నుండి అమెరికానుండికూడ వస్తున్నాయి.

రషియా, జర్మనీల సంబంధంగూడ జపానుకి అనుమానం కలిగిస్తున్నది. దూర ప్రాచ్యంలోకూడ రషియా యిష్టం వచ్చినట్లు ఆచరించవచ్చునని జర్మనీ అంగీకరిస్తే, యింక జపాను అక్షరాజ్యాలతో చేరిన లాభం ఏమిటి? అందుకే హిట్లరు కనులన్నింటిని గ్రుడ్డిగ సమర్థించరాదని జపాను పత్రికలు తమ ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నాయి.

దక్షిణ దాడి చేయాలని జపానుకి గుంపుకా ఆశగా ఉంది. డచ్చి తూర్పు దీవులు తమతో ఒడంబడిక గావించుకోవాలి కాని కాలహరణ చేయరాదని జపాను పత్రికలు అంటున్నవి. జపాను చర్యలను ఇంగ్లాండు, ఆస్ట్రేలియా, అమెరికాలు శ్రద్ధగ గమనించుచున్నవి. "ఇతర చోట్లు ఎంత పనిలో ఉన్నా, మా దేశం రక్షించుకోడానికి పూర్తిగా సిద్ధంగా ఉన్నాం. మట్సువోకా (జపాను మంత్రి) జర్మనీతో కలసి పని చేస్తాననడం నేను సహించను" అని ఆస్ట్రేలియా మంత్రి అన్నాడు. డచ్చి తూర్పు దీవుల మంత్రికూడ తమ దీవులను రక్షించుకుంటామని బహిరంగంగా ప్రకటించడం చాల ధైర్యంగా ఉంది.

## హెర్ హెస్ గొడవ

హెర్ హెసు గొడవ ఏమిటో యింకా తేలలేదు. "దుష్టచతుష్టయానికి చెందిన అతని ప్రసక్తియే వలదని మంత్రి హెర్బర్టు మారిసను గారనిరి. అతడు హిట్లరువలెనే అనేక రాజకీయ హత్యానేరములు చేసినపాపి, దుర్మార్గుడు. ఎట్లాంటి వాడయినా యిపుడు నిర్బంధింపబడినాడు" అని మారిసనుగారనిరి. అతడెందుకు ఇంగ్లాండు వచ్చేడన్న విషయమై అనేక విధాలుగ చెప్పకుంటున్నారు. చావుకి భయపడి వచ్చేడని, జర్మనీ గెలవదని నిరాశచెంది వచ్చేడని, హిట్లరికి గుండె బేజారయిందని, ఏమేమో ప్రజలంటున్నారు. కాని ప్రధాన మంత్రి మాత్రం ఏమి చెప్పలేదు. హెసు ప్రతి రోజు ఏమిటో విపరీతంగా వ్రాసి ప్రధాన మంత్రికి పంపుచున్నాడు. హామిల్టను ప్రభువుని రెండు సారులు చూచి సంప్రదించెను. ఇదంతా ఏమిటో ఎందుకో ప్రధాన మంత్రి చర్చిలు బయటకు చెపితేకాని నిజం తెలియదు. ప్రస్తుతం హెస్సు యుద్ధ ఖైదీగా వున్నాడని మాత్రం అతను చెప్పెను.

హెస్సు హిట్లరుకి ముఖ్య బంటగుటచే యింతగా అనుకోవలసివచ్చింది. 1939 లోనే అతన్ని తన తరువాత మూడో నాయక వారసుడుగ హిట్లరు నియమించెను; గత నెలలోనే స్పెయినికి తన రాయబారిగా పంపెను. అందుచే, యింతలోనే యీతను ఇంగ్లాండు వచ్చినంత మాత్రాన, నాజీ పరిపాలన కూలిపోతున్నదని అనుకో నక్కరలేదు. ఇంగ్లాండు యీ యుదంతం గాంచి తబ్బిబ్బుకాదు. హిట్లరు, హెసు యిరువురు పెద్దవారే కావచ్చు, అయినా వారిద్దరికి భేదాభిప్రాయములుండ వచ్చు. దానికేం?

# యుద్ధానంతరం యేర్పాటులు: అమెరికా సూచనలు

ఇంగ్లాండుకొరకు అమెరికాలో తయారగు యుద్ధపరికరాలన్నీ త్రోవలో శత్రువుచే ముంచి వేయబడకుండా ఇంగ్లాండు చేరే ఏర్పాటు తప్పక చేస్తామని అమెరికా మంత్రి కార్డెలు హల్లుగారు ఘంటాపథంగా చెప్పిరి. మా దేశం భద్రత ఇంగ్లాండు రక్షణ పై ఆధారపడియున్నది. కావున, ఇంగ్లాండునకు ఆయుధాలు సరఫరాచేయు పూచీ మాపై నున్నదని వారనిరి. సరకు శత్రునిరోధాలను దాటి ఇంగ్లాండు చేరే పూచీ అమెరికా నౌకాదళంపై గలదని ముందే నౌకాదళాధికారి కర్నలు నాక్సుగారు తెలిపియుండిరి.

అమెరికా కేవలం వర్తక లాభాలకొరకు, స్వార్థంకొరకు యింత బాధ్యతవహించుచున్నదను కోరాదు. మానవకోటి స్వాతంత్ర్యం కాపాడుటవల్లనే అమెరికా యిదివర కింత కీర్తిగడించింది. ఆ నూతన ప్రపంచనాయకులు నిరంకుశ డిక్టేటరుల పాలనను ఖండించినంత తీవ్రంగా యింకెవ్వరు ఖండించలేదు. నిరంకుశ పాలకుల దురాక్రమణము ప్రపంచ వ్యాపారమును చెడగొట్టును. వారి దురాశ, దౌర్జన్యాలచే తారుమారయిన ప్రపంచార్థికస్థితిని ఉద్ధరించుటకే అమెరికా పూనుకొన్నదని రూజువెల్టుగారు చెప్పియుండిరి. దానినే వారి మంత్రి కార్డెలు హల్లుగారు విపులీకరించుచు, ప్రపంచంలో అరాచకం లేకుండా చేయాలనియు, శాంతి కుదిరినాక యీ దిగువ సిద్ధాంతాలు అమలు జరపాలనియు చెప్పిరి:—

1. అమిత జాతీయాభిమానం వలన వర్తక నిర్బంధములు యెక్కువ కాకుండా చేయాలి.

2. అంతర్జాతీయ వ్యాపారం అభివృద్ధిచెందుటకు ఒక దేశం యింకోదేశం పై వర్తకం విషయములో అభిమానాలు, అసూయలు చూపరాదు.

3. అన్ని దేశాలకు ముడిపదార్థాలు అందు బాటులో ఉండాలి.

4. అంతర్జాతీయ ఒడంబడికలందు, సరకు సప్లై నియమములు సరకువాడుకునే దేశాలకు అనుకూలంగా ఉండాలి.

5. అన్ని దేశాలలో క్రొత్త ప్రయత్నాలు అభివృద్ధి చెందుటకు అనుకూలంగా అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు నిర్మింపబడి, వర్తక రూపమునే బాకీలు తీర్చుకొనుఅవకాశాలు, అన్ని దేశాలకు అనుకూలంగా ఉండవలెను.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.